# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్

హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రము ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై. పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహనీయులను కోరుచున్నాము.

విచ్చెనమెల్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి — అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

స్థాపితం : 1961

**హెడ్ ఆఫీసు : కంభం**-523 333. ప్రకాశం జిల్లా. ✆ : 32262 (S.T.D. 08406)

**బ్రాంచి ఆఫీసు : శ్రీశైలం**-518 101. కర్నూలు జిల్లా. ✆ : 87158 (S.T.D. 08524)

అతి పవిత్రమైన జోతిర్లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కాపర్ డ్యామ్ ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడినందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 115 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండీ మూడవ సోమవారం వరకూ జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు</u> : ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుద్దురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్సడ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందు సదుపాయం గలదు. అట్టి సభ్యత్వం పొందు దాతలు మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకులు "18×15" అంగుళములు గల దాత ఫోటో (ల్యామినేషన్) సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు 1160-00 ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో (ల్యామినేషన్) సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవితసభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి : ప్రతి యొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించుచున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ — అధ్యక్షులు

మరియు కార్యవర్గ సభ్యులు

యక్కలి బాలరత్నం — ప్రధాన కార్యదర్శి

**వైశ్య ప్రబోధిని**

(మాసపత్రిక)



**స్థాపితము**

1969



**సంపుటి**

29



**సంచిక**

3



**నవంబరు - 1997**



సంపాదకులు :

'సంఘోద్ధారక'

'వైశ్యభూషణ'

పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :

వైశ్య ప్రబోధినీ

కార్యాలయం

"వాసవీ భవన్"

జయనగర్ కాలనీ,

కడప - 516 002.

ఫోన్స్ : 24911, 25025.




# ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్యుల కర్తవ్యం

(ఈ పత్రిక 1975 జూలై సంచికలో ఈ పత్రికా సంపాదకులు పై శీర్షికను వ్రాసిన సంపాదకీయాన్ని తిరిగి ప్రచురిస్తున్నాము. మాజీమంత్రివర్యులు శ్రీ కె.రోశయ్య గారు 9.6.1975న జరిగిన సర్వసభ్య సమావేశములో ఆంధ్రప్రదేశ్ఆర్యవైశ్యమహాసభకు అధ్యక్షులయ్యారు. మహాసభ అధ్యక్షులుగా శ్రీరోశయ్య గారు జరిపిన తొలి జిల్లా పర్యటన కడపదే. ఆ పర్యటనా కార్యక్రమాన్ని ఏర్పాటుచేయడములో ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య యువజన సంఘాలసమాఖ్య నిర్మాణ, ప్రధాన కార్యదర్శిగా ఈ పత్రికాసంపాదకులు అతి ముఖ్య భూమికను నిర్వహించారు. తన కడప జిల్లా పర్యటన జయప్రదమైన విషయాన్ని మరువని శ్రీరోశయ్యగారు. ఒక సందర్భములో "మహాసభ సభ్యత్వాన్ని నీవు కడపలో మంచి మనసుతో ప్రారంభించావు. అది బాగా జరుగుతూంది." అని వ్రాశారు. సంపాదకులు ఈ సంపాదకీయాన్ని అప్పటి మహాసభ ఆర్థిక స్థితినీ, మహాసభ ఉజ్వల భవిష్యత్తుకు తోడ్పడవలసిన బాధ్యతనూ రాష్ట్ర వైశ్యులకు గుర్తు చేయుటకే వ్రాశారను విషయము ఈ సంపాదకీయం చదివిన వారికి అర్థమౌతుంది. ఈ పత్రికాసంపాదకులుగా నాకూ - ఆంధ్రప్రదేశ్ఆర్యవైశ్యమహాసభకూ గల దీర్ఘకాలిక అనుబంధాన్నీ, మహాసభ ఈనాడు ఇంతగా బలోపేతము అవడానికి, ఈ పత్రికా సంపాదకులు చేసిన కృషినీ గుర్తుచేయుటకే యీ పునర్ముద్రణ.)

ఈ సంపాదకీయాన్ని చదివి శ్రీ రోశయ్యగారు సోదరుడు లక్ష్మీకాంతం చక్కని సంపాదకీయం వ్రాశారు. మహాసభ అభివృద్ధికి తోడ్పడే సంపాదకీయం అని ప్రశం

సించారు మహాసభ మునుపటి అధ్యక్షునికి గాని, ఇప్పటి అధ్యక్షునికి కాని అప్పటికి ఆంధ్రప్రదేశ్‌ఆర్యవైశ్య మహాసభ ఉన్నట్లుగాకూడ తెలియదు

"కలౌ సంఘ బలి" అనేది అనుభవంతో పెద్దలు చెప్పిన సూక్తి వ్యక్తి సాధించలేని కార్యాన్ని "సంఘం" సాధిస్తుందనేది వివాదంలేని మాట అయితే ఆ సంఘము ఆర్థికంగా తగినంత బలాన్ని పుంజుకొని, తన కాళ్లమీద తాను నిబడుకోగల స్థితిలో ఉండాలి.

దానికి సమర్థవంతమైన నాయకత్వం, కార్యవర్గంలో సేవాతత్పరతగల వారూ ఉండాలి.

దీనికి తోడు "సంఘము కొఱకు తాము"గాక, "తమ కొఱకు సంఘము"అనే భావనలో, ఆ సంఘానికి చెందిన వారెల్లరూ ఉండాలి అప్పుడే యే సంఘమైనా అనుకున్నది సాధించగలదు.

అందుకే, ఆంధ్రప్రదేశ్‌ఆర్యవైశ్య మహాసభకు నూతనంగా యెన్నికైన శ్రీరోశయ్య గారు, మహాసభ ప్రస్తుత ఆర్థికస్థితిని సమగ్రంగా అవగాహన చేసుకొని, మహాసభకు పై లక్షణాలన్నింటినీ చేకూర్చేందుకు ప్రయత్న పడాలనుకోవడం.

మహాసభను ఆర్థికంగా పటిష్టం చేయాలనీ, అందుకు రాష్ట్రమంతటా తిరిగి పదివేలకు పైగా మహాసభకు జీవిత సభ్యులను చేర్పించాలనీ సంకల్పించారు.

సంకల్పించుటే గాక, కడపజిల్లా అంతటా మూడురోజులు తిరిగి వారి సంకల్పాన్నీ, భవిష్యత్ కార్యక్రమాన్నీ వివరించారు. నిజానికి వీరు తీసుకున్న యీ పర్యటనాకార్యక్రమం, ఆర్థికంగా పటిష్టం చేయాలనుకోవడం యెంతో ముఖ్యమైనవి.

నాయకుడు యెంత సమర్థవంతుడైనా, దాన్ని నడిపేందుకు తగినంత ఆర్థికవనరులు కూడ సమకూరినప్పుడే ఆ సంఘము అనుకున్నది చేయగలదు. సంఘీయులకు తోడ్పడగలదు.

శ్రీ రోశయ్యగారి సంకల్పాన్ని క్షుణ్ణంగా అర్థంజేసుకొని, వారి యీ సంకల్పాన్ని వెంటనే కార్యరూపంలో పెట్టేందుకు వైశ్యుడై పుట్టిన ప్రతి వ్యక్తీ తమంతకు తామే ముందుకు రావలసి వుంది.

అధ్యక్షులు తీసుకున్న యీ ప్రణాళికవల్ల, సభ ఆర్థికంగా పటిష్టం కావడమేగాక, బాధ్యతాయుతులగు వ్యక్తులు వేల సంఖ్యలో భాగస్వాములు కావడం జరుగగలదు.

జీవిత సభ్యత్వం రూ. 101/- అనేది సామాన్యమైన వ్యక్తులకు కూడ బరువైనది గాదు. కావున, ప్రతి ఆర్యవైశ్యుడు గూడ యీ విషయంలో సహేతుకంగా ఆలోచించి, మహాసభను ఆర్థికంగా పటిష్టం చేయుటే గాక, సమర్థవంతమైన నాయకత్వాన్ని సద్వినియోగం చేసికొనుటకు ప్రయత్నించాలను కోవడం అవశ్య కర్తవ్యం.

# వైశ్యుల సహజ గుణభూషణమైన త్యాగముయొక్క వన్నెతగ్గలేదు.

డా. సి.వి. సుబ్బన్న శతావధాని,

ప్రాచీన భారతదేశమున వైశ్యులు అన్నదాతలు, జీవనదాతలు. "కృషి పాశుపాల్యం వాణిజ్యం చేతి వృత్తయః" అన్నారు. భూములను చదును చేయించి, దున్నించి, పైరు పెట్టి పండించు అన్నదాతలు వైశ్యులు. అందుకే వీరికి 'భూమిస్పృశులు' అనెడి పేరుకలిగినది. గోమహిష్యాది పశుపోషణ వృత్తిధురీణులై పాలు, నెయ్యి సమకూర్చుచుండెరి. ఇక వాణిజ్యమా? వెండి బంగారు, నవరత్నాలు, ఏనుగులు, గుఱ్ఱాలు, సుగంధద్రవ్యాలు, చీనాంబరాలు, సమస్తవస్తువులు ద్వీపాంతరాలనుండి కూడ తెప్పించి విక్రయించుచుండెరి. వైశ్యులు శ్రీమంతులు, బల పరాక్రమవంతులు అయియుండిరని సుప్రసిద్ధ చరిత్రపరిశోధకులు శ్రీ మల్లంపల్లిసోమశేఖరశర్మగారు వ్రాసిరి. బలవంతులు కానిచో ఇంత వాణిజ్యము నిర్వహింప గలరా?

దేశమునకు ఆయువుపట్టు అయిన ఆర్థికతంత్రమంతయు వైశ్యాధీనమై యుండెను.

కాలము మారినది. వృత్తిధర్మములు మారినవి. అయినను వైశ్యుల సహజగుణభూషణమైన త్యాగముయొక్క వన్నె తగ్గలేదు.

దేశభక్తి చూచినచో, మనదేశమునకుస్వాతంత్ర్యము దెచ్చిన గాంధీ మహాత్ముడు వైశ్యుడు. ఆంధ్రరాష్ట్రము దెచ్చిన పొట్టి శ్రీరాములు వైశ్యుడు. ఇంతకంటే చేసిన వారెవరు.

పురాణేతిహాసములు చూచినను వైశ్యప్రశస్తి విశిష్టముగానున్నది. తులాధారుడను వైశ్యుడు మహాజ్ఞానియని ఆకాశవాణి పలికెను. జాజిలియను ఋషి తులాధారుని దర్శించి ధన్యుడయ్యెను. 'కౌరవవంశవర్ధనుడగు ధృతరాష్ట్రుడు గాంధారిని పెండ్లాడె, గాంధారి తోబుట్టువుల అదే ముహూర్తమున పదుండ్రను పెండ్లాడెను. తరువాత భీష్ముడు వందమంది సుందరాంగులను దెచ్చి పెండ్లి చేసెను. ధృతరాష్ట్రుని నూటపదనొకండుగురు భార్యలలో ఒకతె వైశ్యయువతి. ఈమె కొడుకు యుయుత్సుడు. ఈతడు భారతయుద్ధమున పాండవపక్షమునజేరి బ్రతికెను. వైశ్యులు ధర్మపక్ష మవలంబింతురనుట కిదియొక తార్కాణ.

ఆదికవి నన్నయభట్టారకుడు వైశ్యులు సుగుణవశ్యులు అని ప్రశంసించెను. ఇట్టి గుణసంపన్నులు, కృషి పాశుపాల్య వాణిజ్య నిర్వాహకులు అయిన వైశ్యుల వైశిష్ట్యము నుపశ్లోకించు నుత్తమగ్రంథము శ్రీకన్యకాపురాణము.

ఈ పురాణమును తెనుగున పద్యప్రబంధముగా వ్రాసిన కవీశ్వరుడు శ్రీ దోమా వెంకటస్వామిగుప్తగారు. వీరు సాధారణకవిశ్రేణికి జెందినవారు కారు. "గంటకు నూఱు పద్యము లఖండతరంబగు ధారతో" పలుకగలవారు. ఇటువంటి ఆశుకవికి, ఇంట గూర్చుండి పురాణము వ్రాయుట లెక్కకాదు. బాల్యాదిగా సారస్వతసేవయే జీవనోపాధిగా బెట్టుకొన్నవాడు కనుక, చిన్న - పెద్దపుస్తకాలు చాల వ్రాసిరి. ఏబదేండ్లు సమీపించుతరుణమున "కన్యకా పురాణము" రచింపవలెనను కుతూహలము కలిగినది. తత్ఫలమే యాకృతిరత్నము.

శ్రీ గుప్తగారి వాఙ్మయసౌభాగ్యము గుఱించి వ్రాసిన నావ్యాసము 'వైశ్యప్రబోధిని' ఫిబ్రవరి 1997 సంచికలో ప్రకటించిరి. కనుక మరల వ్రాయనక్కఱ లేదు.

ఎపుడో ముప్పదేండ్ల క్రిత మీపురాణము ముద్రితమై యుండెను. ప్రకృతము దాని ప్రతులులేవు. అవశ్యపఠనీయమైన యీగ్రంథము నాంధ్రసోదరులకు అందజేయు నుదారాశయముతో శ్రీ లక్ష్మీకాంతం శ్రేష్ఠిగారు శ్రమకోర్చి చక్కగా ముద్రింపించిరి.

*(శ్రీదోమావెంకటస్వామిగుప్త సాహిత్యపీఠంవారు ప్రకటించిన గుప్త గారి శ్రీకన్యకా పురాణము నుండి).*

## ఆంధ్రప్రదేశ్‌లోని ఆర్యవైశ్యవృత్తి ఉద్యోగుల సంఘాలు (AVOPAS)

### జిల్లావారిగా

**1. ఆదిలాబాద్ జిల్లా** 4
మంచిర్యాల, లక్సెట్టిపేట, బెల్లంపల్లి, సిరిపూర్ - కాగజ్‌నగర్

**2. అనంతపురం జిల్లా** 10
తాడిపత్రి, ఉరవకొండ, కదిరి, రాయదుర్గం, అనంతపురం, గుంతకల్, ధర్మవరం, గుత్తి, హిందూపూర్, మడకశిర

**3. చిత్తూరు జిల్లా** 4
తిరుపతి, చిత్తూరు, మదనపల్లి, పలమనేరు

**4. కడప జిల్లా** 6
కడప, బద్వేల్, రాజంపేట, నందలూరు, రైల్వేకోడూరు, కమలాపురం

**5. తూర్పుగోదావరి జిల్లా** 3
రాజమండ్రి, కాకినాడ, తుని

**6. గుంటూరు జిల్లా** 8
గుంటూరు, తెనాలి, చిలకలూరిపేట, నరసారావుపేట, సత్తెనపల్లి, పిడుగురాళ్ళ, వినుకొండ, మాచర్ల

**7. హైదరాబాద్ & రంగారెడ్డి జిల్లాలు** 5
హైదరాబాద్, హబ్సిగూడ, అమీర్‌పేట దిల్‌షుక్‌నగర్, సికింద్రాబాద్

**8. కరీంనగర్ జిల్లా** 9
కరీంనగర్, గోదావరిఖని, సిరిసిల్లా, జగిత్యాల, పెదపల్లి, మంథని, చొప్పదండి, జమ్మికుంట, కొమట్ల

మరికొన్ని మేరుసంచికలో - (వాసవీప్రభ జూన్ 1997నుండి)

# "జెండా ప్లీడరు" శ్రీదేవతశ్రీరామమూర్తి





పింగళి వెంకయ్యగారు రూపొందించిన త్రివర్ణ పతాకాన్ని జాతీయ జెండాగా నిర్ణయించు కొన్నాము. కానీ ఆ జండాను స్వేచ్ఛగా ఎగురవేసు కొనే హక్కు మనకు లభించింది 1932 తర్వాతే. ఉన్నత న్యాయస్థాన తీర్పు ద్వారా ఆ హక్కును అశేష భారతీయులకు కలిగించిన వారు స్వర్గీయ దేవతశ్రీరామమూర్తి గారు. ఇందుకే ఆయనకు జండాప్లీడరు అన్నది అన్వర్థపౌరుషనామధేయం అయింది.

అది 1932. ఆ సంవత్సరములో ఒక రోజు. రాజమహేంద్రవరము (రాజమండ్రి) లోని దేవతశ్రీరామమూర్తి గారి మేడపై మువ్వన్నెల పతాకం రెపరుపలాడుచూ ఉంది. ఆనాటి పోలీసు అధికారి 'డయ్యర్' కు రెపరెపలాడుచూ ముద్దుల మూట గట్టుచున్న ఆ పతాకం కన్పించింది. ఆహ్లాదాన్ని కలిగించ వలసిన అదృశ్యం డయ్యరుకు ఆగ్రహాన్ని కలిగించింది. ఎంత కమనీయ దృశ్యమైనా కరకు హృదయాలను కద లించలేదు కదా? వెంటనే ఐదు వందల మంది రక్షకభటులతో 'డయ్యరు' వడివడగా శ్రీరామమూర్తి గారి మేడ వద్దకు వచ్చాడు. ఆమేడపైకి వెళ్ళేందుకు గల తాపలు వసారాలో ఉన్నవి. సోపాన పంక్తిని అధిరోహించుకు ఆరంభించాడు 'డయ్యరు.' మేడలోపల హాలులో ఉన్న మూర్తి గారు ఆ విషయాన్ని గమనించారు. కోపోద్రేక్తులయ్యారు. కన్నులు నిప్పులు గ్రక్కాయి. వెలుపలికి వచ్చారు మూర్తి. "ఆగు. వెనుకకు వెళ్ళు" అంటూ సింహంలా గర్జించాడు. మ్రాన్పడి పోయాడు డయ్యరు. జలియన్‌వాలా బాగులో జరిగిన ఘోరకలికి డయ్యరే మూలము అని తెలిసిన వారికి డయ్యరు ఎంతటి క్రూరుడో,ఎంతటి దుర్మార్గుడో, ఎంతటి నరహంతకుడో ఆతనిలోని రక్తపిపాస ఎంతటిదో ప్రత్యేకంగా ఇక్కడ వ్రాయనక్కరలేదు. డయ్యరు మూర్తిగారి మాటలను లెక్కపెట్ట లేదు. మరో అడుగు ముందుకు వేశాడు. శ్రీరామమూర్తిగారి కంఠము మరింతగా గర్జించింది. "వెనక్కు తిరిగిపో లేక పోతే న్యాయస్థానములో కేసువేస్తా. నీ కథ చూస్తా". అంటూ మరింతగట్టిగా పలికారు మూర్తిగారు. డయ్యరు తల ఎత్తి మూర్తి గారిని చూచాడు. ముఖం ఎఱ్ఱగా ఉంది. భ్రుకుటి ముడిపడి ఉంది. అవి కన్నులు కావు. చింతనిప్పులు, పొగలు గ్రక్కు చున్నాయి. భయపడ్డాడు. ఆయన ముందు తన పప్పులు ఉడకవు అనకున్నాడు. డయ్యరు అక్కడ నుండి వెళ్ళిపోయాడు. శ్రీరామమూర్తిగారి ఇంటి

చుట్టూ చేరి ఏమి జరుగుతుందో అని ఉత్కంఠతో చూస్తున్న జనం ఆశ్చర్య పోయారు. శ్రీరామమూర్తిగారి ధైర్య సాహసాలను ఎంతగానో ప్రస్తుతించు కుంటూ వెళ్ళారు.

ఆ తర్వాత శ్రీరామమూర్తి గారు జాతీయ జండాను ఎగురవేసుకొనుటలో భారతీయు లకు గల హక్కును ప్రశ్నిస్తూ మద్రాసు హైకోర్టులో కేసు వేశారు. హేతుబద్ధంగా సాగిన శ్రీరామమూర్తిగారి వాదనను విన్న హైకోర్టువారు "జండాను ఎగురవేసు కొనుటకు భారతీయులకు హక్కుఉంది" అంటూ విప్లవాత్మకమైన తీర్పును ఇచ్చారు. ఇలా వచ్చింది మనందరకీ మన జాతీయ జండాను నిర్భయంగా - నిస్సంకోచంగా ఎగురవేసుకొనే హక్కూ, అర్హతా. శ్రీరామ మూర్తిగారు జండా ప్లీడరుగా అన్వర్థ పౌరుషనామధేయులడయ్యారు. స్వతంత్ర భారతి స్వర్ణోత్సవాలు జరుపుకొంటున్న ఈ సమయాన మన మంతా ఈయన్ను భక్తితో సంస్మరించకపోతే కృతఘ్నుల మవుతాము. 'కృతఘ్నుని మాంసాన్ని కుక్కలు తినగా రోయున్' అంటుంది పంచమ వేదమైన భారతము.

శ్రీరామమూర్తిగారు రాజమహేంద్ర వర పురప్రముఖులు, పేరున్న న్యాయవాదులు. స్వాతంత్ర్యసమరయోధులు పశ్చిమ గోదా వరిజిల్లాలోని ప్రసిద్ధజమిందారీ కుటుం బములో దేవత వారిదీ ఒకటి. ఇప్పుడేమో కానీ, వీరి కుమారులు రామమోహన్‌రావు గారి హయాము వరకూ ఈ మేడలో జమీందారీ చిహ్నాలు కన్పించేవి. శ్రీరామ మూర్తిగారు కళాపోషకులు, రసజ్ఞులు, వధాన్యులు, కవి, పండిత, నట, గాయకు లకు వీరి యిల్లు కొలువు కూటము. శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి, చిలకమర్రిలక్ష్మీ నరసింహము వంటి కవులూ, బ్రహ్మ జ్యోస్యుల, స్థానం నరసింహరావుల వంటి నటశేఖరులూ వీరిచే సత్కరించబడినవారే. శరన్నవరాత్రులలో సంగీత సభలను ఏర్పాటు చేసి అరియకుడి, ఆదిభట్ల, ద్వారం మొదలగు సంగీత విద్వాంసులను పిలిపించి, ఘనంగా సత్కరించేవారు వీరు.

శ్రీరామమూర్తి గొప్ప విద్యాభిమానులు. కరుణా హృదయులు. పేద విద్యార్థుల విద్యార్జనకు సహాయపడ్డారు.

ఒక నాటి చెన్నపురిమేయరూ, జాతీయ నాయకులూ, స్వామివెంకటా చలం శ్రేష్ఠి, ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రథమ ఉపాధ్యక్షులు శ్రీకట్టమంచి రామలింగా రెడ్డి వీరికి ప్రాణమిత్రులు. రెడ్డిగారు వీరి 'దేవత' అను ఇంటిపేరుపై శ్లేషనిల్పి 'నాదేవత' అని సంభోదించే వారు.

గాంధీమహాత్ముని పిలుపువిని స్వాతంత్ర్య సమరములో కాలు మోపారు మూర్తిగారు. స్వచ్ఛమైన కాంగ్రెసు వాదిగా పేరు పొందారు.

మహాత్మాగాంధీ, సుభాష్‌చంద్రబోసు, నెహ్రూ, రాజేంద్రప్రసాద్, సరోజినీదేవి మొదలగు పలువురు జాతీయ నాయ కులనూ, గొప్ప దేశ భక్తులనూ పిలిచి తన ఇంటి ఆతిథ్యము ఇచ్చిన భాగ్యశాలి మూర్తిగారు. ప్రకాశంపంతులు, కళా వెంకట్రావు పొట్టిశ్రీరాములు, బులుసు సాంబమూర్తి మొదలగు ఆంధ్ర నాయ కులు ఎందరికో వీరి ఇల్లు విడిది. వీరి సహాయాన్ని అర్థించి నిరాశులైనవారు

లేరని ప్రతీతి. వేలాది రూపాయలు వారికై వెచ్చించిన త్యాగశీలురు శ్రీరామమూర్తిగారు.

1937 లో మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు జరిగిన ఎన్నికల్లో కాంగ్రెసు పార్టీ తరపున పోటీచేసి, ఎన్నికై ఆరు సంవత్సరాలు ఆ పదవిలో ఉన్నారు. న్యాయవాదిగా తాను ఆర్జించే వేలాది రూపాయలను సత్కార్య నిర్వహణకే వెచ్చించారు. రాజమండ్రి ఎలెక్ట్రికల్ కార్పోరేషన్‌కు ఛైర్మన్‌గా కూడ వీరున్నారు.

గంగమ్మ, సుబ్బరాయుడు వీరి జననీ జనకులు. వీరి జన్మ నక్షత్రము పునర్వసు. శ్రీరాముని-జన్మనక్షత్రము కూడ పునర్వసు నక్షత్రమే. శ్రీమతి లక్ష్మీదేవి వీరి శ్రీమతి. లక్ష్మీదేవి యాదవోలు జమిందారగు కొత్త వెంకటరామయ్యగారి పుత్రిక. బాల్యము ననే తన ఆంధ్రరచనకు బంగారు పతకాన్ని అందుకొన్న విదుషీమణి లక్ష్మీదేవి

సాము గరిడీలలో శ్రీరామమూర్తిగారు సిద్ధహస్తులు. గణితశాస్త్రము, సంస్కృతముల పై వీరికి అభిమానం మెండు.

మూర్తిగారు గొప్పన్యాయవాదులు. 'హిందూలా' అకౌంట్స్‌కు సంబధించిన వ్యాజ్యాల్లో వీరు బహు నేర్పరులు. అటువంటి దావాలలో వీరు ఒక పక్షమున ఉండితీరవలసిందే ఆరేడు మందికి తక్కువ కాకుండా జూనియర్లు వీరి వద్ద ఉండేవారు. పౌరహక్కులపరిరక్షణకై కంకణంకట్టుకొన్నవారు వీరు. ఎవ్వరికీ లొంగని స్వతంత్రప్రవృత్తి మూర్తిగారిది. ఆంధ్రకేసరి ప్రకాశంపంతులూ, న్యాపతి సుబ్బారావు గారలు న్యాయవాద వృత్తిలో వీరికి మంచి మిత్రులు.

మూర్తిగారికి ఇద్దరు కుమారులు. జ్యేష్ఠ పుత్రులు శ్రీరామమోహన్‌రావుగారు. రెండవ కుమారులు శ్రీసుబ్బారావు 'లా' చదివి 1936లో న్యాయవాదవృత్తిని స్వీకరించారు. ఒక సంవత్సరం తన వద్ద తగిన శిక్షణ ఇచ్చిన శ్రీరామమూర్తిగారు 1937లో తనవృత్తిని తనయునికి అప్పగించి తన 'ప్రాక్టీసు'ను మానివేశారు. న్యాయ వాదిగా జీవితాన్ని ప్రారంభించిన సుబ్బారావు తన వృత్తిలో అంచెలంచెలుగా ఎదిగి జిల్లా న్యాయాధీశులుగా పదవీ విరమణచేశారు. ప్రసిద్ధ బాలసాహిత్య నిర్మాత, విదుషీమణి స్వర్గీయ శ్రీమతి కోడూరిలీలావతీదేవిగారు వీరి ఏకైక పుత్రిక. నాలుగుసార్లు ఆంధ్ర సాహిత్య అకాడమీ నుండీ బహుమతి నందుకొన్న గొప్పరచయిత్రి శ్రీమతి లీలావతీదేవిగారు.

వృత్తిలో విత్తమూ, విఖ్యాతీ విరివిరిగా నార్జించిన అదృష్టవంతులు శ్రీరామమూర్తిగారు. మూర్తిగారిది నిండైన నిగ్రహము. అప్పుడేతీన వెన్నవంటిది వీరి హృదయము.

శ్రీరామమూర్తిగారు 1941 సెప్టెంబరులో గుండె ఆగి హఠాత్తుగా మరణించారు. వీరి స్మారకభవనమున వీరి చిత్రపటాన్ని ఆవిష్కరిస్తూ డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు "నాదేవతా" అంటూ ఆర్తితో ఆవేదన పడ్డారు.

'ప్లాస్టర్ ఆఫ్ ప్యారీస్'తో తయారుచేసిన శ్రీరామమూర్తిగారి నడుంవరకూ గల విగ్రహాన్ని వీరి కుమారులు శ్రీరామమోహన్‌రావుగారిని దర్శించుటకు వెళ్ళినప్పుడు సుమారు ద్వాదశవర్షముల క్రితం చూచి నట్లుగా గుర్తు.

# శ్రీ వాసవీ కన్యకా పురాణం

మూలం : వ్యాసప్రణీత స్కాంధ పురాణం
సేచ్ఛానువాదము : శ్రీ పి. లక్ష్మీకాంతంశ్రేష్ఠి (సంపాదకులు)

గత సంచిక తరువాయి

## తొమ్మిదవ అధ్యాయము

(అంత, కలియుగము ప్రారంభమైనది. నాలుగు లక్షల ముప్పది రెండు వేల సంత్సరముల ప్రమాణముగా గల- ఆ కలి యుగమున 2626 సంవత్సరములు గడచినవి. ఆ సమయమున భారత దేశమున గోదావరీతీరమున గల బృహ దద్రిని రాజధానిగా చేసుకొని కల్హారుడు అను రాజు పదునెన్మిది పట్టణాలనూ పరిపాలిస్తున్నాడు. ఆయన సత్యపరా క్రమవంతుడు. దయాగుణము కలవాడు. ఆయన పాలనలో ప్రజలు ఆనందంగా జీవిస్తున్నారు. ఆయనకు ఎందులోనూ లోటులేదు. నెలకు మూడు వానలు కురుస్తున్నాయి. పైరు పచ్చలతో, పాడి - పంటలతో రాజ్యము శోభా యమానంగా ఉంది. ఒక శుభదినమున ఆయనకు ఒక కుమారుడు జన్మించాడు. ఆ కుమారుడు పుట్టినప్పుడు కుసుమవృష్టి కురిసింది. ఈ కుమారునికి కుసుమశ్రేష్ఠి అని నామ కరణము చేయమని అశరీరవాణి పలికింది. కల్హారుడు పుత్రునకు కుసుమ శ్రేష్ఠి అని నామకరణము చేసెను.

ఓ వైశ్య ఋషులారా! పూర్వము ఆది శక్తి యిచ్చిన వర ఫలితముగా జన్మించిన ఉత్తరదిశాధిపతికుబేరుడే ఈ కుసు మార్యుడు - అని మీరు గ్రహించే ఉందురు.)

సంప్రాప్తేద్వాదశవర్షే ఉపనీయ పితా సుతమ్
గురవే భాస్కరాచార్యమనయేనన్న వేదయత్.

292 పుట. 11 శ్లోకం.

పంద్రెండవ సంవత్సరము రాగానే తండ్రి కుమారునకు ఉపనయనము చేసి గురువర్యుడగు భాస్కరాచార్యులకు ఒప్పగించెను.

293 పుట. 11 శ్లోకం.

భాస్కరాచార్యులు కుసుమశ్రేష్ఠికి వేద వేదాంగములూ, సకల విద్యలూ నేర్పెను. కొంత కాలమునకు కుసుమశ్రేష్ఠికి వివాహ సమయము వచ్చెను. అప్పుడు భాస్క రాచార్యుడు కల్హారునితో రాజా! మణి మండలుడు అను నామముగల వైశ్యశ్రేష్ఠుని యొక్క కుమార్తె 'కౌసుంభి' అను నామె మీ కుమారునకు యుక్తమై నదిగా భావిస్తున్నాను. ఆమెనే అతనికి భార్యగా జేయుడు. అని చెప్పెను. (కల్హా రుడు అందులకు అంగీకరించెను.)

11 - 11 1/2 (293)

దూతల వలన భాస్కరాచార్యులు వచ్చుట విని మణిమండలుడు శీఘ్రమున గురువునకు ఎదురేగి, పిలుచుకొని వచ్చి, పీఠముపై కూర్చుండ బెట్టి పాద్యము, అర్ఘ్యము మొదలగు విధులచే పూజలు చేసి, చిరునగవుతో గురువర్యా! మీ దర్శనము వలన నేను ఇప్పుడు కృతార్థుడను

అయ్యాను మంగళప్రదమైన మీ ఆగమనము వలన నాకు ఆనందం కలిగింది.

15 1/2 - 18 1/2 (295)

అప్పుడు భాస్కరాచార్యుడు, మణిమండలా! కల్హారుని కుమారుడైన కుసుమశ్రేష్ఠికి నీ కుమార్తెను ఇచ్చి వివాహము చేయుము అని చెప్పెను. మణిమండలుడు సంతుష్టుడై 'అట్లే'అని అంగీకరించెను. భాస్కరాచార్యుడు వివాహమునకు ముహూర్తమును కూడ నిశ్చయించి, వచ్చి, కల్హారునకు జరిగిన విషయమును తెలియజేసెను.

19 - 21 (295)

అనంతరము, శుభ దినమున, శుభ లగ్న మందు కల్హారుడు బంధువులతో కూడి తన పుత్రుడు కుసుమశ్రేష్ఠికి సంతోషముతో వివాహము చేసెను. పిమ్మట వైశ్యశ్రేష్ఠుడైన కుసుమాఖ్యుడు 'కౌసుంబి' అను భార్యతో కూడి సుఖముగా ఉండెను. అంత బుద్ధిశాలియైన కల్హారుడు ఇంద్రియములను నిగ్రహించి, గురువు ఉపదేశించిన మార్గమున తపస్సు కొఱకై వనమునకు పోయెను.

21 1/2 - 23 1/2 (295).

కుసుమశ్రేష్ఠి యొక్క యీ వివాహ కథ పవిత్రమైనది. కలి దోషములు పోగొట్టునది. శుభములను కలుగచేయునది. పుణ్యమును వృద్ధిచేయునది. ఈ కథను వినిన వారలు భూమి యందు సకల సంపదలను పొందుదురు.

పుట 294, శ్లో. 24, 24 1/2

(ఇది స్కాంధ పురాణమందు - సేనత్సు జాతీయ సంహిత గల ఉత్తర ఖండము - కుసుమార్యుని వివాహ విషయమును చెప్పునది. తొమ్మిదవ అధ్యాయము.)

## పదవ అధ్యాయము

(ప్రభాతస గోత్రము) నందు జన్మించి, వైశ్య సముదాయమునందు ప్రశస్తుడైనఆ కుసుమ శ్రేష్ఠికి సంతానము కలుగ లేదు. సంతానము లేని దుఃఖముతో బహు కాలము పరితాపమును పొందిన కుసుమ శ్రేష్ఠి ఒకనాడు భాస్కరాచార్యులను పిలిపించి, సత్కరించి, "స్వామీ! లోకమందు పుత్రులు లేని వారికి ఊర్ధ్వలోకప్రాప్తి లేదని విద్వాంసులు చెప్పుచున్నారు. అందువలన నా హృదయము దుఃఖము వలన తపించుచున్నది" అని పలికెను.

1 - 3 అ - 29 పుట 295

ఆ మాటలు విన్న భాస్కరాచార్యులు కుసుమశ్రేష్ఠిని చూచి, "వత్సా! చింతించకు. విధ్యుక్త ప్రకారము యజ్ఞము చేయుము. నీకు సంతానము కలుగును. పూర్వము ఇంద్రునితో సమానుడైన దశరథమహారాజు సంతానము కొఱకు వశిష్ఠమహర్షి యొక్క ఆజ్ఞచే బ్రాహ్మణులతో కూడి పుత్ర కామేష్ఠిని చేసి రత్నముల వంటి నలుగురు పుత్రులను పొందెను. ఆ విధముగా మీరును చేయుడు. ఒక పుత్రికనూ, పుత్రునీ పొందుడు" అని పలికెను.

3 1/2 - 6 1/2 అ.29. పుట 295

భాస్కరాచార్యులు చెప్పిన యాగ ద్రవ్యములను సంపాదించి, వేద వేదాంగ పారంగతులైన ఋత్విక్కులను ఎన్నుకొని, సభాసదులతో కుసుమశ్రేష్ఠి యజ్ఞదీక్షను పూనెను. భాస్కరాచార్యుడు హోతగా విధి విధానమున అగ్ని యందు దేవతలకు హవిస్సులను వ్రేల్చెను. కొందఱు సామ గానములను చేసిరి. మఱికొందరు శాస్త్ర వాదములు చేసిరి. ప్రదక్షిణ జ్వాలలు గలవాడై ప్రసన్నుడై అగ్ని ప్రకాశించెను.

ఋత్విక్కులు పిలువగా దేవతలు వచ్చి హవిర్భాగములను తీసికొనిరి. నేతి వాసనతో కూడిన పొగలు దశదిశలా వ్యాపించెను.

7 - 11 1/2 అ.9. పుట 295

పుత్రకామేష్ఠి యజ్ఞముచే సంప్రీతి పొందిన మహేశ్వరి అగ్నిహోత్రుని ప్రేరణ చేసెను. అగ్నిదేవుడు సంతోషించి, విశాల వక్షస్థలము, దీర్ఘభుజములు, పచ్చని మీసములు, మణిఖచితములైన బంగారు కుండలములు కలిగి, మిక్కిలి ప్రకాశమైన స్వరూపముతో కన్పించి పరమాన్నముచే నిండిన బంగారు పాత్రను కుసుమార్యుని హస్తము నందు ఉంచి, అంతర్ధాన మయ్యెను.

12 - 14 1/2 అ.9 పుట. 298

వైశ్యకులశ్రేష్ఠియగు కుసుమశ్రేష్ఠి వర మును పొంది సఫలమనోరథుడై, ఋత్విక్కులకు దక్షిణలిచ్చి, సభాసదులను పూజించి, బ్రాహ్మణులకు శ్రేష్ఠములైన రత్నములను, ధనములను ఇచ్చెను. అనేక విధములైన దానములు చేసెను. పాలు, పెరుగు, నెయ్యి, పాయసములతో కూడిన అన్నమును బ్రాహ్మణులకు పెట్టించెను. అనంతరము ఆ పాయసమును తన భార్యకు ఇచ్చెను. ఆయమ్మ ఆ పాయసాన్నమును భుజించి నియత చిత్తయై నడచుకొను చుండెను.

15 - 19 1/2 అ.9 పుట 299.

కౌసుంబి గర్భము ధరించినది. ఆమె స్తనముల కొనలకు నలుపు రాగా అవి లక్కచే ముద్రించినట్టి బంగారు కలశముల వలె ఉండెను. మిక్కిలి నీలమై ప్రకాశమానంగా ఆమె నూగారు, స్తనములను చందన పర్వతమును ఎక్కు నల్లని ఆడుత్రాచుపామువలె కన్పించెను. బీద వాడొకడు, అదృష్టవశమున ఐశ్వర్య వృద్ధిని పొందినట్లుగా అంతకు ముందు కన్నులకు అగుపడనంత సన్నగా నున్న ఆమె నడుము ఇప్పుడు స్పష్టముగా కన్పించుచూ దినదినాభివృద్ధి పొందెను. శుక్లపక్షము నందలి చంద్రుని వలె ఆమె గర్భము దినదినాభివృద్ధి పొందుచుండగా కుసుమ శ్రేష్ఠికి ఆనందము ఎక్కువ కాసాగెను.

20 - 23 1/2 అ.9 పుట 300

గృహ్యా సూత్రములలో చెప్పిన రీతిగా కుసుమశ్రేష్ఠి ఆమెకు పుంసవనము మొదలగు కర్మలను చేయించెను. రత్నములు, బంగారు, వస్త్రములు బ్రాహ్మణులకు దానము ఇచ్చి వారిని ఆనంద పరచెను.

24 - 25 అ.29

కుసుమాంబ ఒక మంచిలగ్నమున ముందుగా ఒక పుత్రికను కనెను. వెనుక వంశమును వృద్ధి చేయగల అత్యుత్తముడైన కుమారుని కనెను. తేనె వలె అతి మధురముగా ఉండు పుత్రి, పుత్రకా జనన విషయమును విని కుసుమగుప్తుడు పురుటింటి వద్దకు వచ్చి కవలలుగా పుట్టిన ఆ శిశువులను చూచి ఆనందమును పొందెను.

26 - 28 అ.29

అనంతరము తేజస్సూ, ఒక హస్తమున కమలమూ, ఒక హస్తమునపాశమునూ, ఒక హస్తమున చిలుకా, ఒక హస్తమున వీణెనూ, మల్లెపూలవలెనూ, చంద్రుని వలెనూ, తెల్లని దేహమూ, పరిశుద్ధమైనదీ, కోటి చంద్రులతో సమానమగు కాంతీ, పరిశుద్ధమైన బంగారు వంటి మూర్తీ, దివ్యములైన బంగారు ఆభరణములతో

అలంకరించుకొని, బంగారు చేలమును ధరించినదీ. స్వర్ణహారములు, మణులతో చేసిన కర్ణభూషణములు ధరించి, వైఢూర్యములు తాపిన కిరీటము కలిగి మిక్కిలి ప్రకాశమానముగా గల దివ్య రూపముతో మహాదేవి ఆ కుసుమశ్రేష్ఠికి కనిపించినది. ఆ కాంతిమంతమగు దేవిని కాంచిన కుసుమగుప్తుడు ఆ దివ్యమంగళ విగ్రహాన్ని చూస్తూ నిలబడి పోయెను. అప్పుడు ఆ దేవి కుసుమగుప్తుని చూచి, సంతోషముతో దివ్య జ్ఞానమును ప్రసాదించెను.

28 1/2 - 32 1/2 అ.29 - 303.

శ్రీమంతుడగు కుసుమశ్రేష్ఠి దివ్య జ్ఞానమునుపొంది ఆమెకు నమస్కరించెను. అంజలి ఘటించి స్తోత్రము చెసెను. ఆ పరమేశ్వరి పాదములపై బడి ప్రార్థించెను. ("వత్సా! లెమ్ము. లెమ్ము. నీవు పూర్వ జన్మమున ఉత్తరదిశను పాలించే కుబేరుడవు. నన్ను మనస్సులో ఉంచుకొని గొప్ప తపము చేసి నన్ను మెప్పించి, లోకేశ్వరినీ, పరాశక్తినీ నైన నన్ను బిడ్డగా పొందు వరమును పొందితివి. ఆ వర ఫలముగా ఇపుడు నీకు బిడ్డగా పుట్టితిని' - అని చెప్పి ఆ దేవి అంతర్ధానమాయెను. 'మాయ' అను తెరచే కప్పబడిన ఆ కుసుమ శ్రేష్ఠి ఆ దృశ్యమును స్వప్నసమానమైనదిగా భావించి ప్రకృతికి బద్ధుడైన మానవుని వలె మోహితుడాయెను.)

33 - 37 1/2 అ. 29 - పుట 303.

కుసుమశ్రేష్ఠి స్నానము చేసి, రత్న ములనూ, ధనమునూ, ధాన్యములనూ ద్విజులకు దానము చేసెను. పితరుల ఋణము నుండీ విముక్తుడాయెను. జ్యోతిశాస్త్రజ్ఞుడు ఆ కుసుమశ్రేష్ఠి యొక్క పుత్రీ పుత్రకులకు శాస్త్రమును చూచి జన్మ పత్రికను వ్రాసెను. "వైశాఖ మాసమున, శుక్లపక్షదశమిన - మంగళకరమైన శుక్ర వారమున - పునర్వసు నక్షత్రమున - శుభగ్రహములతోకూడిన శుభలగ్నము నందు ఈ శిశుద్వయము జన్మించెను. లగ్నమును ఉచ్ఛస్థితిలో ఉండు మూడు శుభ గ్రహములు శుభమైన దృష్టితో చూచు చున్నవి. సూర్యుడు, చంద్రుడు ఎంత కాలము ఉందురో అంత కాలము మంగళముతో కూడి వైశ్యవంశము ఈ శిశువులిద్దరి వలనా శాశ్వతమైన కీర్తిని పొందును - అని ఆ జ్యోతిష్కుడు ఆ జన్మపత్రికలో వ్రాసెను. కుసుమశ్రేష్ఠి జ్యోతిష్కునికి రత్నములను బహు మానముగా ఇచ్చెను.

38 -43 1/2 అ. 29 - పుట 305

వైశ్యవంశము అను సముద్రమున పుట్టిన చంద్రునితో సమానుడగు ఆ కుసుమశ్రేష్ఠి దేవి అనుగ్రహము వలన జన్మించిన సూర్యతేజస్సుగల తన కుమారునికి 'విరూపాక్షుడు' అని నామ కరణముచేసెను. తరువాత కొమార్తకు పేరు పెట్టు ప్రయత్నములో ఉండగా "పూర్వము ఈమె విష్ణువుకు సహోదరిగా పుట్టియుండినది. అందువలన 'వాసవి' అను పేరుతో ప్రసిద్ధురాలు కావలసి ఉంది. ఇంకనూ ఈమె 'కన్యక' గానూ, 'బ్రహ్మచారిణి' గానూ పిలువబడినది. అందువలన ఈ బాలిక 'కన్యక' అను పేరుతో ప్రఖ్యాతిని పొందును " అని ఆకాశవాణి పలికెను. కుసుమగుప్తుడు ఆ బాలికకు 'వాసవి" అని పేరు పెట్టెను.

43 - 48 పుట 304

(ఇంకావుంది)



తుపాకీ గుండుతో సహజీవనం చేసిన స్వాతంత్ర్య సమరయోధులు

# శ్రీ దాసరి సుబ్బరావు



భారతదేశ స్వాతంత్ర్య సముపార్జనకై నిరుపమాన త్యాగాలొనర్చిన వారిలో శ్రీదాసరి సుబ్బరావుగారూ ఒకరు. 'క్విట్ ఇండియా' ఉద్యమ సందర్భంగా జరిగిన పోలీసు కాల్పుల్లో రావుగారికి శరీరంలో తుపాకీ గుండు ఇరుక్కుంది. ఆ గుండుతో ఆయన సహజీవనం చేశారు.

సుబ్బరావుగారిది రాజమండ్రి. రాజమండ్రి పురపాలక సంఘోన్నత పాఠశాలలో చదువు ముగించారు. అక్కడే ఉన్న కళాశాలలో ఇంటర్మీడియట్ చదివారు. డిగ్రీ పొందాలనుకుంటున్నారు. రెండవ ప్రపంచ యుద్ధము కారణంగా వాల్తేరులో ఉన్న ఆంధ్ర విశ్వవిద్యాలయ కళాశాలను గుంటూరుకు మార్చారు. డిగ్రీ చదువుటకై సుబ్బరావుగారు గుంటూరు వచ్చి డిగ్రీ కాలేజీలో చేరారు. అప్పటికి ఆయన వయస్సు 19 సంవత్సరాలు.

బొంబాయిలో జాతీయ నాయకులంతా సమావేశమై 'క్విట్ ఇండియా' తీర్మానాన్నిఆమోదించారు. మహాత్మా గాంధీ 'విజయమో! వీరస్వర్గమో'! అంటూ పిలుపు నిచ్చారు. ఆ వాణి నేలనాలుగు దిక్కులా మారుమ్రోగింది. ఆ ఉద్యమాన్ని అణచి వేయాలని అప్పటి తెల్లదొరల ప్రభుత్వం కఠినమైన చర్యలు తీసుకొంది. దేశ నాయకులను ఎక్కడవారిని అక్కడ కారాగృహాలలో బంధించారు. నాయకులంతా జైళ్ళలో ఉన్నందున, ఉద్యమానికి నాయకత్వము ఎవరు వహిస్తారు? అను ప్రశ్న ఉదయించింది. "ఉద్యమములో పాల్గొనే ప్రతి వ్యక్తి నాయకుడే" - అంటూ గాంధీ జవాబు చెప్పారు.

మాతృభూమి స్వాతంత్ర్యం కోసం యువకులూ, విద్యార్థులూ వీరావేశంతో విజృంభించారు. రెండవ ప్రపంచ యుద్ధపు కారుమేఘాలు ప్రపంచమంతా ఆవరించిన రోజులు కూడ అవి.

గాంధీజీ పిలుపు సుబ్బరావు చెవుల పడింది. ఆయనలోని దేశభక్తిని తట్టిలేపింది. స్వాతంత్ర్యసమరములో పాల్గొనేందుకు ఆయత్తులయ్యారు.

1942 ఆగస్టు 13. గుంటూరులోని జిన్నా టవర్ వద్దగల పోలీసుస్టేషన్ ఎదుట 'పికెటింగ్'. జరుగుచూ ఉంది. ఆ పికెటింగ్‌లో సుబ్బరావు అగ్రభాగాననిలిచారు. గుంటూరులోని ఆంధ్రరత్నభవనము నుండీ జిన్నాటవర్ వరకూ, అటు కూరగాయల మార్కెట్ వరకూ చేరిన ప్రజలు శాంతియుతంగా 'క్విట్ ఇండియా' అంటూ నినాదాలు చేస్తున్నారు. 'బ్రిటీషు సామ్రాజ్యవాదం నశించాలి' - అంటూ ఉన్నట్లుండి

పోలీసుస్టేషన్‌పై ఎవరో రాళ్ళు వేశారు. పోలీసులు కాల్పులు జరిపారు. ఆందోళన కారుల్లో అగ్రభాగాన ఉన్న సుబ్బారావు గారి శరీరంలోకి 'తూటా' వెళ్ళింది. తుపాకీ గుండు శరీరంలో దూరడంతో స్పృహ తప్పిపోయారు. మూడురోజులు ఆయన స్పృహ లేకుండానే ఉన్నారు. ఆ గుండు ఆయన వెన్నెముకకు తగలవలసిందే. దైవబలంవల్ల తప్పిపోయి, వెన్నెముకకు వెంట్రుకవాసిలో వెళ్ళి శరీరములోనే ఉండింది. ఆనాటి ఆ పోలీసు కాల్పుల్లో పదముగ్గురు క్షతగాత్రులయ్యారు. వారిలో ఆ తర్వాత ఆరుగురు చనిపోయారు. ఏడుగురు జీవితాంతంవరకూ అంగవికలురుగా ఉండిపోయారు. ఆ ఏడు మందిలో మన సుబ్బారావుగారూ ఒకరు.

గుండు తగిలినందున ఆయన కాళ్ళు రెండూ చచ్చుబడిపోయాయి. ఆ కాళ్ళలో ఒకకాలు మొద్దుబారికూడ పోయింది. ఆ గుండును శరీరంనుండీ తొలగిస్తే ప్రాణానికే ప్రమాదమని భావించిన డాక్టర్లు ఆ గుండును శరీరములోనే ఉంచుకోమన్నారు. జీవితాంతంవరకూ ఆయన ఆ గుండుతో సహజీవనం చేశారు.

తనను కలిసినవారికి ఆనాటి ఉద్యమ విషయాలను ఎంతో ఆసక్తితో చెప్తూ ఆనాటి క్విట్ ఇండియా ఉద్యమంలో తాను పాల్గొన్నందుకు గుర్తుగా తన శరీరములో గుండు ఉన్న చోటును చూపించేవారు సుబ్బారావు గారు.

సుబ్బారావు గారు 1946లో పట్టభద్రులయ్యారు. ఉద్యోగానికి పరుగులు తీయక, టొకు వ్యాపారాన్ని సాగించారు. పట్టణములోని పలు వాణిజ్యసంస్థలకు నేతృత్వం వహించారు. రావుగారికి, నలుగురు కుమారులు. ముగ్గురు కుమార్తెలు.

తన శరీరంలో ఉన్న తుపాకీగుండును తీయించు కొనుటకు 1947లో ఒకసారి ప్రయత్నించారు. ఆయన్ను పరీక్షించిన విశాఖ పట్టణములోని కింగ్‌జార్జి వైద్యశాల లోని డాక్టర్లు ఫలితం లేదన్నారు. ఆ తర్వాత ఆయన ఆ ఊసే ఎత్తలేదు.

1981 ఆగస్టు 13 నాటి 'ఆంధ్రప్రభ', 'ఇండియన్‌ఎక్స్‌ప్రెస్' దినపత్రికలు ఈయన్ను గురించిన చక్కని వ్యాసాన్ని మొదటి పుట లోనే ప్రముఖంగా ఛాయా చిత్రముతో ప్రచురించాయి.

## మీరు ఇంతచక్కగా పద్యాలు వ్రాయగలరని అనుకోలేదు

ప్రియమయిన లక్ష్మీకాంతం శ్రేష్ఠిగారికి నమస్కారకుశలోపరి. ఏకోనత్రింశత్తమ జన్మదినసంచికలో మీ హితోపదేశ పద్యములనుచూచి, ఆశ్చర్యము, ఆనందము పొందితిని. మీరు ఇంతచక్కగా పద్యములు వ్రాయగలరని అనుకోలేదు. చాల సంతోషము.

(ఏకోనత్రింశత్తమజన్మదినసంచికఅనగా 29వ జన్మదినసంచిక సెప్టెంబరు 1997)

సి.వి సుబ్బన్న, శతావధాని,

31-10-1997.

## శిఖాకొల్లు వెంకటేశ్వర్లు గారికి భీమరథశాంతి

ప్రకాశంజిల్లా సింగరాయకొండ పుర ప్రముఖులు శ్రీ శిఖాకొల్లు వెంకటేశ్వర్లు గారి భీమరథ శాంత్యోత్సవము 6-11-1997 7-11-1997వ తేదీలలో సింగరాయకొండలోని ఆయన స్వగృహములో జరిగింది. ఒక వ్యక్తి తన 70వ ఏటజరుపుకొనే శాంతినే భీమరథశాంతి అంటారు.

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1997 నవంబరు 21 నుండి 1997 డిసెంబరు నెల 20 వరకు)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| ఆదివారము | | 23 | 30 | 7 | 14 | 21 |
| సోమవారము | | 24 | డిసెంబరు 1 | 8 | 15 | |
| మంగళవారము | | 25 | 2 | 9 | 16 | |
| బుధవారము | | 26 | 3 | 10 | 17 | |
| గురువారము | | 27 | 4 | 11 | 18 | |
| శుక్రవారము | 21 | 28 | 5 | 12 | 19 | |
| శనివారము | 22 | 29 | 6 | 13 | 20 | |

నవంబరు 30 :- దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంస్థల చట్టముక్రింద పొందిన రిజిస్ట్రేషన్ సర్టిఫికేట్‌ను పునరుద్ధరించుకొనుటకు పంపవలసిన దరఖాస్తు (ఫారము A-A)ను అందుకు సంబంధించిన కార్మికశాఖాధికారికి పంపుటకు ఆఖరుతేది.

నవంబరు 30 :- కార్పొరేట్ అసెసీలు 1996-1997 సంవత్సరానికి పంపవలసిన ఇన్‌కంట్యాక్సు, వెల్తుట్యాక్సు అన్యువల్ రిటర్నులు అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుశాఖాధికారికి చేరుటకు ఆఖరుతారీఖు.

నవంబరు 30 :- కార్పోరేట్ అసెసీలు ఆదాయపుపన్ను చట్టములోని 44AB సెక్షనుల క్రింద 1998-1999 అసెస్‌మెంటు సంవత్సరానికి చెందిన ఆడిట్ రిపోర్టును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి పంపుటకు చివరితేది.

నవంబరు 30 :- పదవీవిరమణచేయు ఉద్యోగులకు 1997 అక్టోబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంటును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి పంపుటకు చివరితేది.

నవంబరు 30 :- 1997 అక్టోబరు నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను అధికారికి చేర్చుటకు చివరితారీఖు.

డిసెంబరు 2 :- జ్యేష్ఠకార్తె రాక తె.5-29.

డిసెంబరు 15 :- పొట్టి శ్రీరాముల వర్ధంతి.

డిసెంబరు 15 :- చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించువర్తకులు చెక్కుతోబాటు A-2రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి పంపుటకు తుదిరోజు.

డిసెంబరు 15 :- కంపెనీకానిఅసెసీలు రెండవకంతు అడ్వాన్సుట్యాక్సును, కంపెనీఅయినఅసెసీలు 1998-1999 అసెస్‌మెంటు సంవత్సరానికి సంబంధించి చెల్లించవలసిన మూడవకంతు అడ్వాన్సుట్యాక్సును చెల్లించుటకు ఆఖరురోజు.

డిసెంబరు 16 :- మూలకార్తె రాక ఉ. 7-11

డిసెంబరు 20 :- A-2 రిటర్నును చలానాతోబాటు అందుకు సంబంధించిన అమ్మకంపన్నుశాఖాధికారికి చేర్చుటకు చివరిరోజు.

**23, 30, 7, 14, 21 ఆదివారాలు**

---

*- నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.*

# భారతదేశ స్వాతంత్ర్యము కోసం పోరాడిన వైశ్యసోదరులు



సేకరణ శ్రీచుండూరిఅప్పారావు. రావెల

(భారతదేశ దాస్య విదళనోద్యమములో వైశ్యసోదరులు కూడ గణనీయంగానే పాల్గొన్నారు. 1941 మార్చి నెల 31 వ తేదీవరకూ లభించిన వివరాల మేరకు అట్టి స్వాతంత్ర్యసమరయోధుల జాబితాను జిల్లా వారిగా ప్రచురిస్తున్నాం. వీరు గాక ఇంకా యెవరైనా ఉంటే వారి పేర్లను వ్రాసి పంపిస్తే మరు సంచికలో ప్రచురిస్తాము.

ఈ జాబితాలో ఉన్న వారి ఛాయా చిత్రాలనూ, జీవిత విశేషాలనూ వారు కానీ వారికి సంబంధించిన వారు కానీ పంపితే ఈ వైశ్యప్రబోధినిలో తప్పక ప్రచురిస్తాం ఈ జాబితానుపంపి సహకరించిన శ్రీ చుండూరిఅప్పారావుగారికి మా కృతజ్ఞ తలు - సంపాదకులు).

### అనంతపురం జిల్లా

1. జూటూరి రామలింగయ్య, ఉరవకొండ
2. వేములవెంకటసుబ్బయ్య, కుంటిమద్ది
3. కలువల చిన్ననారాయణప్ప, ధర్మవరం
4. మట్టా వెంకటరామయ్య, కదిరి.
5. యం. శంకరనారాయణగుప్త, పెనుగొండ
6. జయం సత్యనారాయణ, న్యామద్దల
7. మేడా వెంకటాచలం, దేమాలపల్లె
8. డి. నారాయణసెట్టి, చిలమత్తూరు
9. చేగు అనంతకృష్ణమూర్తి, మడకశిర
10. శ్రీకాకుళం వెంకటరమణయ్యశ్రేష్ఠి, తిమ్మనచర్ల
11. జి.వి. సత్యనారాయణసెట్టి, బుక్కపట్నం
12. బెల్లంకొండ నారాయణసెట్టి, కుంటిమద్ది
13. ఇట్టా వెంకటనారాయణప్ప, నల్లచెరువు
14. మంచికంటి సుబ్బరాయుడు, బండమీదిపల్లె
15. సుంకురంగయ్య, చెన్నంపల్లె
16. మేడాశాయప్ప, కుంటిమద్ది
17. చుండూరి చిన్నరంగయ్యసెట్టి, తిమ్మేపల్లి
18. వై.వి. సెట్టి, అనంతపురం.
19. యన్. వెంకటరామయ్యసెట్టి, తిమ్మనచర్ల
20. కల్లమడి శేషయ్యసెట్టి, బండమీదపల్లె
21. కె.రాధాకృష్ణయ్యశ్రేష్ఠి, కల్లూరు
22. వి.జి కొండప్పసెట్టి, శింగనమల
23. మారం యం. అశ్వర్థనారాయణసెట్టి, హిందూపురం
24. పోలా వెంకటరత్నం, తాడిపత్రి
25. జూటూరు చౌడప్ప, నరసాపురం
26. పెణుజూరు నారాయణప్ప, నల్లమడ
27. జయం కృష్ణయ్యసెట్టి, కల్యాణదుర్గం
28. జి. పోలిసెట్టి, ధర్మవరం
29. ఇట్టా వెంకటరామయ్యసెట్టి, పెనుగొండ

30. గూడూరు సుబ్బయ్య, ఇల్లూరు
31. కల్లమడి కొండయ్యసెట్టి, తరిమెల

**కడప జిల్లా**

1. బి. సుబ్బరాయసెట్టి, తలమంచిపట్నం
2. ముచ్చర్ల వెంకటనారాయణగుప్త, పోరుమామిళ్ల
3. కె. పి. నరసింహులుసెట్టి, ముద్దనూరు
4. ఆరవేటిసుబ్బరాయుడు, ముద్దనూరు.
5. జె. తంబయ్యసెట్టి, రాజంపేట
6. మేడా వెంకయ్య, కొండాపురం
7. సనిశెట్టి సత్యనారాయణగుప్త, రాజంపేట
8. మదళ్లపల్లె పెద్దన్నసెట్టి, ప్రొద్దుటూరు.
9. నూకల కొడంయ్యసెట్టి, కొటాలపల్లె
10. భూపాళం సుబ్బరాయుడుశ్రేష్ఠి, జమ్మలమడుగు
11. నక్కా వెంకటసుబ్బయ్య, బిజుర్రాపాడు
12. సుంకు చిన్నసుబ్బరాయుడుసెట్టి, ప్రొద్దుటూరు.
13. దరిశి వెంకటసుబ్బయ్య, దాచేపల్లి
14. వి.ఆర్. సత్యనారాయణగుప్త, రాజంపేట
15. కశెట్టి చినవెంకటసుబ్బయ్య, ప్రొద్దుటూరు.
16. మేడా రామసుబ్బయ్య, వేముల
17. అరవేటి నరసయ్యసెట్టి, నల్లచెరువుపల్లె
18. సుంకు రామసుబ్బయ్యసెట్టి, వేముల
19. క్రిష్టం రామచంద్రయ్యసెట్టి, వల్లూరు

**గుంటూరు జిల్లా**

1. మద్ది బగళా ప్రసాద్, గుంటూరు
2. చీమకుర్తి సత్యనారాయణ, వేమూరు.
3. అమరా వెంకటసుబ్బరావు, చీరాల
4. కొత్తమాసు వెంకటకృష్ణగుప్త, వేటపాలెం.
5. చుండూరు వెంకయ్య, అలపాడు
6. పువ్వాడనాగభూషణం, బాపట్ల
7. యం. కనక దుర్గాప్రసాద్, ఇంటూరు.
8. కుట్టుపల్లి నాగలక్ష్మమ్మ, గుంటూరు.
9. జల్దు నాగభూషణం, బాపట్ల
10. అలపాటి నాగభూషణం, బాపట్ల
11. చలవాది పుల్లయ్య, గురజాల
12. పువ్వాడ మృత్యుంజయరావు, గుంటూరు.
13. త్రిపురమల్లు లక్ష్మయ్యగుప్త, గుంటూరు.
14. అలపాటి గోపాలరావు, యడ్లపల్లి.
15. అలపాటి నరసింహారావు, యడ్లపల్లి.
16. శిఖాకొల్లు జగన్నాధగుప్త, జాంద్రపేట
17. మద్ది సుదర్శనం, గుంటూరు.
18. గుంటూరు అక్కేశ్వరరావు, గుంటూరు.
19. డాక్టర్ రాచపూడి వెంకటసుబ్బరావు, గుంటూరు
20. వేముల వెంకటప్పయ్యగుప్త, గుంటూరు.

**కర్నూలు జిల్లా**

1. నాయకంటి రంగయ్యసెట్టి, ప్యాపల్లి
2. కాల్వచిన్న సుబ్బరాయుడుసెట్టి, ఆర్లగడ్డ.
3. యెలుకూరి సుబ్బరత్నమ్మ, నంద్యాల.
4. కె. సుబ్బరాయుడు, చింతకుంట.
5. తొమ్మంద్రు లక్ష్మీనరసయ్యసెట్టి, పత్తికొండ.
6. గడ్డం సుబ్రహ్మణ్యగుప్త, నంద్యాల.

7. గుండా సుబ్బరాయుడుసెట్టి, అళ్లగడ్డ.
8. టంగుటూరి సుబ్బరాయగుప్త, రాజపాండ్లపల్లె.
9. నూకల సుబ్బరాయుడుశ్రేష్ఠి, ఎర్రగుంట్ల.
10. కాకుమాను సుబ్బరాయుడుశ్రేష్ఠి, అహోబిలం.

## చిత్తూరు జిల్లా

1. యం.వి. పాపన్నగుప్త, మదనపల్లె.
2. టంగుటూరి గోపాల కృష్ణయ్య, తవనం.
3. యన్.రాధాకృష్ణయ్యసెట్టి, మదనపల్లె.
4. ఓలేటి వెంకటక్రిష్ణయ్య, మదనపల్లె
5. వి.వి. రామయ్యసెట్టి, రేణిగుంట
6. యం. రామచంద్రసెట్టి, కుప్పం.
7. పి. ఆళ్వారుసెట్టి, పుంగనూరు.
8. పి. వెంకటరంగంసెట్టి, కాళహస్తి.
9. యన్. లక్ష్మినారాయణసెట్టి, తిరుపతి.
10. పొట్టి ఆళ్వారుసెట్టి, చిత్తూరు.

## నెల్లూరు జిల్లా

1. చాట్లవెంకటాచలంసెట్టి, గూడూరు.
2. పేర్ల భద్రయ్యసెట్టి, నెల్లూరు.
3. కొనగళ్ల శేషాచలంసెట్టి, ఇందుపూరు.
4. మిట్టపల్లిరాధాకృష్ణయ్య, కందుకూరు.
5. యం.వి. రాజుగుప్త, సుళ్లూరుపేట.
6. అమరాశివయ్య, గూడూరు.
7. పెనుబోలు సుబ్బయ్యసెట్టి, నెల్లూరు.
8. పచ్చిగోళ్లయానాదిసెట్టి, చెన్నూరు.
9. దొడ్డిపర్తి పొలిసెట్టి, సుళ్లూరుపేట.

## పశ్చిమగోదావరి జిల్లా

1. చుండూరు రత్నమ్మ, జమీందారిణి, ఏలూరు.
2. మోతే నారాయణరావు, ఏలూరు.
3. పెసల సత్యనారాయణ, పెంటపాడు.
4. అద్దేపల్లి సత్యనారాయణమూర్తి, జమీందారు, పాలకొల్లు.
5. పురంజనార్ధనగుప్త, ఏలూరు.
6. ఒబిలిసెట్టి, మాణిక్యాలరావు, విస్సాకోడేరు.
7. పొలిసెట్టి వెంకటసుబ్బరావు, పాలకొల్లు.
8. పొలిసెట్టి సీతారామయ్య, పాలకొల్లు.

## బళ్ళారి జిల్లా

1. బి. చెన్నప్పశ్రేష్ఠి, హోస్పేట.
2. పత్తికొండగురునాధప్ప, హోస్పేట.
3. కె. రామచంద్రగుప్త, కురుగోడు.
4. రామసెట్టిగారు, హోస్పేట.
5. రామచంద్రగుప్త, బళ్లారి.
6. సత్రసాల వీరభద్రప్పసెట్టి, బళ్లారి.
7. యన్.వి. సెట్టి, బళ్ళారి.

1. గుంటపల్లి నారాయణగుప్త, బేస్తవారపుపేట.
2. యక్కలిరామయ్యగుప్త, ఎర్రగొండపాలెం.
3. బైసాని సత్యనారాయణగుప్త, కంభం.
4. మట్టా వెంకటసుబ్బరాయగుప్త, బేస్తవారపుపేట.
5. గోనుగుంట్ల అల్లూరయ్యగుప్త, మార్కాపురం.

మరికొన్ని మరు సంచికలో
(స్వతంత్రభారతి స్వర్ణోత్సవాల సందర్భంగా)

# స్వచ్ఛంద ఆదాయ వెల్లడి పథకము - 1997

## కొన్ని ముఖ్యాంశములు

**Sri. C.K. SAMPAT H KUMAR**
B.Com., L.L.B., F.C.A.,
Chartered Accountant, Cuddapah.

1. ఈ పథకము 1.7.97 నుండి 31.12.97 వరకు అమలులో ఉండును.

2. ఈ స్కీము క్రింద ఎవరు అయినను అనగా హిందూఅవిభక్త కుటుంబము, భాగస్వామ్య ఫరంలు, భాగస్వామ్య ఫరం లోని భాగస్థులు మరియు కంపెనీలు ఈ పథకము క్రింద ఆదాయమును వెల్లడి చేయవచ్చును.

3. డిక్లరేషను ఫారాన్ని తమకు సంబంధించిన ఆదాయపుపన్ను కమీషనరు వద్ద దాఖలుచేసి సర్టిఫికేట్ పొందవలెను.

4. వ్యక్తులూ మరియు హిందూఅవిభక్త కుటుంబము (HUF) లూ పన్ను 30% చెల్లించవలెను.

భాగస్వామ్య సంస్థలకు (Partnership Firms) కంపెనీలు 35% పన్ను చెల్లించవలెను.

5. ఈ పథకమునందు వెల్లడి చేయు ఆదాయము మొత్తము ఏ విధముగా వచ్చినదీ తెలుపనవసరం లేదు.

6. ప్రవాస భారతీయులు (Non - Residents) కూడా ఈ పథకము క్రింద ఆదాయమును వెల్లడి చేయవచ్చును.

7. ఈ పథకము క్రింద తాను ఆర్జించిన ఆదాయమును ఒక దరఖాస్తులోనే తెలుపవలయును. తను సంపాదించిన ఆదాయముఎన్ని సంవత్సరములకు సంబంధించినది అయినను ఒక దరఖాస్తులోనే తెలుపవలయును. రెండవ దరఖాస్తు ఫైలు చేయుటకు వీలులేదు.

8. తాము తెలుపవలసిన ఆదాయము 1996-97 మరియు 1997-98 అసెస్మెంటు సంవత్సరాలకు చెందినదైనచో పైరెండు అసెస్మెంటు సంవత్సరములకూ తప్పనిసరిగా ఆదాయపుపన్ను రిటర్ను ఫారాలను ఈ పథకము ప్రారంభము అగు తేదీకి ముందుగనే దాఖలు చేసి ఉండవలెను.

9. తనవద్ద ఇన్‌కంట్యాక్స్ డిపార్టుమెంటుకు తెలుపకుండా ఉన్న ఆదాయమును పై దరఖాస్తునందు తెలుపుటకు వీలు కల్పించడమైనది. పై తెలిపిన శాతము ప్రకారము ఆదాయపుపన్ను చెల్లించిన సరిపోవును. దరఖాస్తులో తెలిపిన ఆదాయముపై ఎటువంటి పెనాల్టీ కానీ, వడ్డీకానీ చెల్లించనవసరం లేదు.

10. తాము ఈ క్రింది సంధర్భములలో కూడా ఆదాయమును వెల్లడి చేయవచ్చును.

I. రిటర్ను ఫారం దాఖలు చేయకుండా వుండినా, లేక

II. తాను దాఖలు చేసిన రిటర్ను ఫారం నందు సంపూర్ణంగా ఆదాయము తెలుపకుండిన ఈ పథకము క్రింద తమవద్ద గల గుప్తఆదాయము వెల్లడి చేయవచ్చును.

11. చనిపోయిన వ్యక్తి తరపున కూడా ఈ పథకము క్రింద ఆ వ్యక్తియొక్క వారసులు ఆదాయమును వెల్లడి చేయ వచ్చును.

12. ఈ పథకము క్రింద ఈ క్రింద తెలుపబడిన సందర్భములలో ఆయా సంవత్సరమునకు సంబంధించిన ఆదాయ మును వెల్లడి చేయుటకు వీలులేదు.

1. ఇన్‌కంట్యాక్సు చట్టంక్రింద సెక్షన్ 142 (అసెస్‌మెంటు చేయునపుడు విచారణకై ఇచ్చు నోటీసు) మేరకు నోటీసు జారీచేసి ఉండిన అట్టి అసెస్‌మెంటు సంవత్సరమునకు.

2. ఇన్‌కంట్యాక్స్ చట్టం క్రింద సెక్షన్ 148 ( సరియైన ఆదాయము చూపలేదని లేక తెలుపవలసిన ఆదా యమును చూపకుండా దాచబడినది అని తెలుపు నోటీసు) జారీ చేసి ఉండిన అట్టి అసెస్ మెంటు సంవత్సరమునకు.

కానీ, నోటీసులు తీసుకొన్న వ్యక్తి 1.7.97 నాటికి మునుపే రిటర్ను ఫారమును దాఖలు చేసిఉండిన ఆదాయమును ఈ పథకము క్రింద వెల్లడి చేయవచ్చును.

13. సెక్షను 133A క్రింద సర్వే జరిగి యుండిన ఎడల ఆ సంబంధిత సంవత్సర మునకు మాత్రము డిక్లరేషను ఫైలు చేయుటకు వీలులేదు. తరువాత సంవత్స రములకు డిక్లరేషన్ ఫైలు చేయవచ్చును. అదే విధముగనే 132 సెక్షన్ క్రింద సెర్చ్ జరిగిన యడల వారు కూడా డిక్లరేషన్ ఫైలు చేయుటకు వీలుండదు కానీ తరువాత సంవత్సరములకు డిక్లరేషన్ ఫైలు చేయవచ్చును.

14. పై తెలిపిన పథకము క్రింద డిక్లరేషన్ ఫైలు చేసినవారు ఆ డిక్లరేషన్ నందు తెలిపిన ఆదాయము పై 30% పన్ను డిక్లరేషన్ ఫైలు చేసిన మూడు (3) మాసములలోగా చెల్లించవచ్చును. కానీ డిక్లరేషన్ ఫైలు చేసిన తేదీ నుండి పన్ను చెల్లించు తేదీ వరకు మాసమునకు 2% చొప్పున పన్ను మొత్తముపై వడ్డీ చెల్లించ వలెను. పై పథకము క్రింద చెల్లించిన పన్ను మొత్తము ఎట్టి పరిస్థితులలోను వాపసు ఇవ్వబడదు. పొరపాటున అధిక మొత్తము పన్ను చెల్లించినచో వాపసు కోరవచ్చును.

15. పై పథకము క్రింద వెల్లడి చేసినటు వంటి మొత్తమును తమ పుస్తకములలో జమ వ్రాసుకొనవచ్చును. అట్లు వ్రాసుకొన్న పిదప జమ వ్రాసుకొన్న విషయమై తమ సంబంధిత ఇన్‌కంట్యాక్సు ఆఫీసరుకు తెలుపవలెను.

16. ఈ పథకము క్రింద తమ గుప్త ఆస్తిని వెల్లడి చేయుటకు వీలు కల్పించ బడలేదు.

17. తాను వెల్లడి చేయదలచుకొన్న మొత్తము నగలరూపములోనున్న యడల అట్టి నగలయొక్క విలువను సర్టిఫైచేస్తూ అప్రూవుడ్ వాల్యుయర్ ద్వారా పొందిన సర్టిఫికేట్ జతపరచవలెను. తాము వెల్లడి చేయు నగలు చాలాపాతవి అయిన 1.4.87 మునుపు సంబంధించినవైనా కూడా 1.4.87 నాటికి వుంచబడిన మార్కెట్ విలువతో తెలిపిన చాలును.

18. ఈ పదకము మాదకద్రవ్య నిరోదక చట్టము క్రింద, COFE POSA క్రింద, ఎన్‌ఫోర్స్‌మెంట్ చట్టముక్రింద, ఉగ్రవాద నిరోధక చట్టము క్రింద మరియు మరికొన్ని ఇతర చట్టముల క్రింద చర్య తీసుకోబడి ఉండినట్టయిన అట్టివారికి వర్తించదు.

19. ఈ పథకము క్రింద తెలిపినటు వంటి ఆదాయమును క్రిందిచట్టముల క్రింద పెనాల్టీ కానీ ప్రాసిక్యూట్ చేయుటకు కానీ ఎవిడెన్సుగా తీసుకొనబడదు.

A. ఇన్‌కంట్యాక్సు యాక్టు
B. వెల్త్ ట్యాక్స్ యాక్టు
C. ఫారిన్ ఎక్చేంజి రెగ్యులేషన్ యాక్టు
D. కంపెనీస్ యాక్టు

20. ఈ పథకము క్రింద వెల్లడి చేయు ఆదాయము అతి రహస్యముగా ఉంచ బడును.

21. డిక్లరేషన్ ఫైలు చేయునపుడు సరియైన ఆడిటర్‌ను సంప్రదించి ఫైలు చేసిన మంచిది.

## మధుమేహవ్యాధి చికిత్సా నిపుణులు శ్రీ రాముగారికి నెల్లూరులో సన్మానం

నెల్లూరు పట్టణములోని శ్రీరామకృష్ణా డయాబిటీస్ సెంటర్ నిర్వాహకులు, మధుమేహవ్యాధి చికిత్సానిపుణులు డాక్టర్ వై రాముగారిని నెల్లూరు అవోపావారు 28.9.97న నిర్వహించిన సుహృద్భావ సమావేశములో ఘనంగా సత్కరించారు. శ్రీరాముగారు చక్కెరవ్యాధి, దాని పరిణామాలు, తీసుకో వలసిన జాగ్రత్తలను గురించి చక్కగా ఈ సమావేశానికి వివరించారు.

## పుంగనూరు ఆర్యవైశ్యసంఘం అధ్యక్షులుగా తిరిగి మునుస్వామిశ్రేష్ఠి

చిత్తూరు జిల్లా పుంగనూరు ఆర్యవైశ్య సంఘం సర్వసభ్యసమావేశము 28.9.97వ తేదీన జరుగ శ్రీ యస్.పి. మునుస్వామిశ్రేష్ఠి గారు తిరిగి అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు.

## అనంతపురములో వృద్ధాప్య పెన్షన్ పధకం ప్రారంభం

అనంతపురం పట్టణము పాతఊరు ఆర్యవైశ్యయువజనసంఘమువారు సరి క్రొత్తగా శ్రీవాసవీ వృద్ధాప్యపెన్షన్ పథకాన్ని ప్రారంభించారు. అనంతపురం పట్టణము లోని యాభైసంవత్సరాలకు పైబడిన పేదవైశ్యులకు లింగబేధము లేకుండా నెలకు తలకొక రూ. 50/-ల ప్రకారమూ ఇవ్వాలన్నది ఈ పథకం ఉద్దేశ్యం. శ్రీ గాయత్రీ స్వాములవారు ఈ సందర్భంగా జరిగిన సభలో పాల్గొని ఈ కార్యక్రమాన్ని ప్రశంసించారు.

## 'వాసవి' చాలా బాగుంది రెండువందలు పంపండి

అయ్యా!

తమరు వ్రాసిన 'వాసవి' నవలా రూపము చాలా బాగుందని శ్రీగాయత్రీ స్వాములవారు ప్రశంసిస్తూ మా అనంతపురం పాతవూరు ఆర్యవైశ్యసంఘానికి వ్రాశారు. ఆ పుస్తకాన్ని ఉచితంగా మన వారందరికీ ఇవ్వాలను కున్నాము. రెండు వందలు పంపండి. మీరు ప్రకటించిన ప్రకారం 25% కమీషనును మినహాయించు కొని రూ. 2250-లు డి.డి. పంపుచున్నాము.

వందనములతో
టి. కృష్ణమూర్తి, 18.9.97

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.
## (రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూలు)

టెలిగ్రాం అన్ని చోట్లా : "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"
టెలిఫోన్ నెం. - మార్కాపురం : 22740, 22004
శ్రీశైలం : 87140, 87114, తిరుపతి : 50030
పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682

## వైశ్య యాత్రికులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

### 1. వాసవీ సత్రం, శ్రీశైలం

150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25.12.62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1251-00లు సమర్పించిన, ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

15×9 రూముకు రూ.30000-00 అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

### 2. వాసవీ నివాస్, పుట్టపర్తి

2 ఎకరముల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. వసతి సత్రమునకు గాను రు.1116-00 సమర్పించిన వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,25,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. **దాతకు** 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును. 2. రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. దాత ఫోటో వేయబడును. 3. రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానం జరుపబడును

## 3. వాసవీ భవన్, తిరుమల

తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు : 50×12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు రూము యివ్వబడును. 14 అంకణములు పరిమితం.

రు.2116-00 సమర్పించిన వారి డబ్బు వసతి సత్రమునకు ఉపయోగింప బడును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన సం॥లో ఒక పర్వ దినం రోజునను, రు.5116-00 సమర్పించిన పర్వదినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును.

## 4. వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టిట్రస్టు, కొత్తవీధి, తిరుపతి.

ఒక భోజనహాలు నిర్మాణంచేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రికుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, వసతులు తాత్కాలికముగా ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రికులు ఉపయోగించుకొన కోర్తాము.

వసతి సత్రమునకు విరాళములు

రు.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. ఫొటో వేసి, నాపరాయిపైన వారి పేరు చెక్కించ బడును.

రు.10000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫొటో వేసి నాపరాయిపైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.5000/-లు సమర్పించినవారికి సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రు.1116/-లు సమర్పించినవారికి వారి ఫోటో వేసి వారి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల పర్వదినం రోజున అన్న సంతర్పణ, ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

## 5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థినిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూలధనం ఏర్పాటుచేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారు గదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైనా మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్ష రూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి సంవత్సరములో 60 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116-00 సమర్పించినవారు మహారాజ పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయిపైన చెక్కించబడును.

రు.5116-00 సమర్పించిన రాజపోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116-00 సమర్పించిన వారు పోషకులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయిపైన అదే సత్రములో వ్రాయబడును.

రు.1116-00 సమర్పించిన వారు సభ్యులు. వీరి ఫోటో, వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCETలో పాసై ఇంజనీరింగ్, మెడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ చతుర్ధ మహా క్రతువు పై క్రతువు జరుగు 9 రోజులు, 108 హోమ కుండములతో కుండమునకు 4గురు దంపతుల ప్రకారం చేయబడును. ఈ సందర్భములో ప్రతి రోజు ఉదయం 6-8 వరకు సామూహిక గీతాపారాయణములు, ప్రతి రోజు ఉదయం 8-12 వరకు క్రతువు జరుప బడును మొదటి రోజు శ్రీమన్నారాయణుని దర్శన క్రతువు, రెండవరోజు రామకృష్ణ క్రతువు, మూడవరోజు అష్టలక్ష్మి క్రతువు, నాల్గవరోజు శ్రీ లక్ష్మీ వెంకటేశ్వరస్వామి క్రతువు, ఐదవ రోజు పుత్రకామేష్టి క్రతువు, ఆరవరోజు రుద్రక్రతువు, ఏడవ రోజు సప్తశతి, దుర్గా క్రతువు ఎనిమిదవ రోజు శ్రీ లలితాదేవి క్రతువు, తొమ్మిదవరోజు శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ క్రతువు, పూర్ణాహుతి జరుపబడును. మధ్యాహ్నం 2 నుండి 7 గంటల వరకు ఆధ్యాత్మిక కార్యక్రమములు, ప్రఖ్యాతి గాంచిన మహాత్ములచే ఉపన్యాసములు, 7-9 వరకు లక్ష దీపాలంకరణలు, యజ్ఞము చేయు వారందరికీ ఉచిత వసతి, ఉపాహార, భోజనములు, యజ్ఞమునకు కావలసిన వస్తువులన్నియు కమిటీవారు ఉచితముగా యివ్వగలరు.

## ఇందులకై సమర్పించవలసిన విరాళములు

1. రు.315-00 సమర్పించినవారు 9 రోజులలో ఒక రోజు ఒక కుండమునకు ఒక ప్రక్క కూర్చొని యజ్ఞము చేయవచ్చును.
2. రు.1116-00 సమర్పించినవారు ఒకరోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. వీరి పేరుతో 100 మందికి అన్నదానం జరుపబడును. యీ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.
3. రు.2500-00 సమర్పించినవారు ప్రతి సంవత్సరము జరుపు యజ్ఞములో ఒక రోజు ఒక కుండమునకు ఒక వైపు కూర్చుని యజ్ఞము చేయవచ్చును. ఈ సంఘములో వంశ పారంపర సభ్యత్వము కలదు.

ఇంకా బియ్యం, పప్పు వగైరా వస్తువులు విరాళములుగా యివ్వవచ్చును.

గమనిక : యజ్ఞం టిక్కెట్లు కావలసినవారు ముందుగా DDలు పంపి ఏ రోజు అయినది వ్రాసి పంపి సీటు రిజర్వు చేయించుకొన కోర్తాము.

పంచమ క్రతువు 1999 మార్చి లోపల తిరిగి క్రతువు చేయవలసి యున్నది.

ఉత్తర ప్రత్యుత్తరములకు

**మూర్తి వెంకటేశ్వర్లు,**

సెక్రటరీ, వాసవీ సత్ర సముదాయం, శ్రీశైలం, కర్నూలు జిల్లా.

**N.B. :** పై సత్రముల పేరుతో - DDలు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము. ఎవరు అడిగిననూ డబ్బు యివ్వవద్దు. అకౌంటు పేయీ చెక్కులు, DDలు యిచ్చేది. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, తిరుమల

73-ఎ, శాంతోమ్ హైరోడ్, మద్రాసు - 600 028.
ఫోన్ : 4942074, 4941973



## విజ్ఞప్తి

అయ్యా,

మా ట్రస్టు బోర్డువారు నూతనముగా విరాళములు వసూలుచేయుటకు క్రింద ఉదహరించిన ప్రకారము తీర్మానించారు.

## "వైకుంఠ నివాసం" స్కీము - 1995 రు.10,116/- లు.

500 సభ్యులు మాత్రమే. పై సత్రమునందు వీరి జీవిత పర్యంతం సంవత్సరమునకు 3 రోజులు వారికిగాని, వారి అనుమతి పొందిన ఆర్యవైశ్యులకు మాత్రమే రూము ఉచితముగా యివ్వ బడును. ఉచితమనగా కనీస మెయిన్‌టెనెన్స్ చార్జి ట్రస్టుబోర్డువారు అట్టి సమయములలో నిర్ణయించిన ప్రకారము వసూలు చేయబడును. సంవత్సరమనగా ఏప్రిల్ 1-వ తేది నుండి మార్చి 31-వ తేది వరకు, తిరుమల చేరుటకు 10 రోజులు ముందుగా రిసెప్షనిస్టు, దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ ధర్మపరిపాలనా సంస్థ, రింగ్ రోడ్డు, తిరుమల అనే అడ్రసుకు తెలియపరచవలెను. ఒక తేదీన ఒకరికి మాత్రమే వ్రాసి పంపవలెను. మరొకరికి వ్రాసి పంపకూడదు. ఏ కారణముచేతనైనా ప్రయాణము నిలిపినచో టెలిగ్రామ్ ద్వారా క్యాన్సిల్ అని కనీసం ఒక రోజు ముందు రిసెప్షనిస్టుకు తెలియపరచవలెను. అలా తెలియపరచనిచో ఒకరోజు మీ కోటాలో తగ్గించ బడును. మైనరు దాతలు అంగీకరింపబడరు. ఎవరు ముందు పంపెదరో వారిని నిర్ణీత పరిమితి లోపలే తీసుకోబడును. తర్వాత పంపినవారికి నిర్ణీత పరిమితి దాటితే వారి డి.డి.లు వారికి వాపసు పంపబడును. పూర్తి మొత్తం ఒకేసారి పంపవలెను.

డి.డి.లు పై సంస్థ పేరుతో మద్రాసు ఆఫీసు అడ్రసుకు "అక్కౌంటు పేయి"లో పంపవలెను. అప్లికేషన్ పూర్తిచేసిన దాత సంతకము తోనే పంపవలెను. వారికి బదులు యితరులు చేసిన చెల్లదు. విశేష పర్వదినములలో రిజర్వేషను ముందుగా చేయబడదు. రిసెప్షనిస్టు అప్పటి పరిస్థితులను బట్టి ఖాళీగా వున్నచో యిచ్చెదరు.

ఇట్లు

**ఆర్.ఆర్.నాథం**
మేనేజింగ్ ట్రస్టీ

దక్షిణ ఇండియా ఆర్యవైశ్య శ్రీ వాసవీ కన్యకా
పరమేశ్వరీ ధర్మ పరిపాలనా సంస్థ.

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

## రిజిష్టర్డు నెం. 328/94

## బ్రహ్మంగారి మఠం - 516 503. కడప జిల్లా.

భారతదేశములోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రికులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు. 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంకుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,516/-లు లేక అంతకు మించి ఇచ్చిన వారు, పై సంఘమునకు శాశ్వత వంశ పారంపర్య సభ్యులుగా ఉందురు. దాత తన హయాములో గానీ, తదనంతరము కానీ తనకు మారుగా దాతచే సూచించబడినవారు ఈ సంఘములో శాశ్వత సభ్యులుగా ఉందురు. సంవత్సరములో 6 రోజులు వీరికి ఉచిత సౌకర్యము కలిగించబడును.

రూ.5,116/-లు ఇచ్చిన దాతల పేరున 10 × 19 అడుగుల అటాచ్డ్ బాత్‌రూముతో కూడ రూము నిర్మించబడును. వీరికి సంవత్సరములో 30 రోజులు ఉచిత సౌకర్యము కలిగించబడును.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కును కానీ, క్రాస్ చేసిన డి.డి.ని కానీ ప్రొద్దుటూరులోని ఏ బ్యాంకులో నైనా చెలామణి అగునట్లుగా, పై అడ్రసుకు పంపి, రశీదు పొందగోరుచున్నాము.

5 వేలరూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనము నందు ఉంచుతారు.

భవన నిర్మాణ కార్యక్రమం శీఘ్రగతిన సాగుచూ ఉంది. ఈ పవిత్ర కార్యక్రమానికి సహకరించ దలచుకొన్న పవిత్ర హృదయులగు వైశ్య మహనీయులను వెంటనే సహకరించగోరుచున్నాము.

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

'ప్రజాబంధు','దానశీల' **కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.11.97 నుండి 20.12.97 వరకు)

కార్పోరేట్ అసెసీలు 1996–1997 సంవత్సరానికి పంపవలసిన ఇన్‌కంట్యాక్సు, వెల్తుట్యాక్సు ఆన్యువల్ రిటర్నును అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను శాఖాధికారికి ఈ నవంబరు 30వ తేదీలోగా చేర్చాలి.

కార్పోరేట్ అసెసీలు ఆదాయపుపన్ను చట్టములోని 44AB సెక్షనుల క్రింద 1998–1999 అసెస్‌మెంటు సంవత్సరానికి చెందిన ఆడిట్ రిపోర్టును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి ఈ నవంబరు 30వ తేదీలోగా చేరునట్లుగా పంపాలి.

పదవీవిరమణ చేయు ఉద్యోగులకు 1997 అక్టోబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంటును అందుకు సంబంధించిన ఆదాయపుపన్నుఅధికారికి ఈ నవంబరు 30వ తేదీలోగా చేర్చాలి.

1997 అక్టోబరు నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపుపన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపుపన్ను శాఖాధికారికి ఈ నవంబరు 30వ తేదీలోగా చేర్చాలి.

కంపెనీకాక ఇతర అసెసీలు తమ రెండవకంతు అడ్వాన్సుట్యాక్సును, కంపెనీ అయిన అసెసీలు తమమూడవకంతు అడ్వాన్సుట్యాక్సునూ 1998–1999 సంవత్సరానికి సంబంధించిన దానిని ఈ డిసెంబరు నెల 15వ తేదీలోగా చెల్లించాలి.

**దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంస్థలు**

1. పై చట్టము ప్రకారమూ రిజిష్టరు కాబడిన మీ వ్యాపార సంస్థయొక్క రిజిస్ట్రేషను సర్టిఫికేట్‌ను రెన్యూ (పునరుద్ధరణ) చేయమని కోరుతూ మీమీ ప్రాంతాలకు చెందిన లేబర్ ఇన్‌స్పెక్టరు వారికి ఈ (నవంబరు) నెల 30వ తేదీలోగా చేరునట్లుగా A-A ఫారాన్ని పంపుటను మరిచిపోరాదు. పై 30వ తేదీకిలోగా చేరునట్లుగా A-A ఫారాన్ని పంపుటను మరచిపోయినవారు తదుపరి జుల్మానాను కూడ చెల్లించవలసి ఉండును.

ఈ చట్టము అనగా "1996 దుకాణాలు - సంస్థల చట్టము క్రింద రిజిస్ట్రేషను రెన్యూ (పునరుద్ధరణ)కు చెల్లించవలసిన ఫీజులు"

| | | | |
|---|---|---|---|
| (1) | ఏ వ్యక్తులైనా నియమించు దుకాణాలు - సంస్థలు | రు. | 10–00 |
| (2) | 5 లేక అంతకులోపు వ్యక్తులను నియమించు దుకాణాలు - సంస్థలు | రు. | 50–00 |

(3) 5కు పైబడి 10కి లోప్ప వ్యక్తులను నియమించు దుకాణాలు - సంస్థలు రు 100-00

(4) 10కి పైబడి 20కి లోప్ప వ్యక్తులను నియమించు దుకాణాలు - సంస్థలు రు 200-00

(5) 20 అంతకు పైబడి వ్యక్తులను నియమించు దుకాణాలు - సంస్థలు రు 500-00

పై విధంగా ఫీజులు Head of account 0230 Labour and Employment (a) Receipts under labour laws అను శీర్షికన చెల్లించాలి.

## అమ్మకంపన్ను చట్టము

1. చెక్కుద్వారా అమ్మకంపన్నును చెల్లించు వర్తకులు తాము కట్టవలసిన అమ్మకంపన్ను మొత్తానికి చెక్కును వ్రాసి డిసెంబరు నెల 15వ తేదీలోగా అందుకు సంబంధించిన అధికారులకు అందునట్లుగా ప్రతినెల పంపవలసిన A-2 రిటర్నును పంపాలి చెక్కుద్వారా కాకుండా చలానాద్వారా అమ్మకంపన్నును చెల్లించు అసెసీలు తాము పంపవలసిన A-2 రిటర్నును డిసెంబరు నెల 20వ తారీఖున కాని, అంతకుముందు కానీ చేరునట్లుగా పంపాలి.

పంచాంగకర్త : 'గుణరోహిణ సమ్మానితులు' "మహాశ్రుతు బ్రహ్మ" బ్రహ్మశ్రీ వంగిపురపు వీరబ్రహ్మ దైవజ్ఞ, అంగలకుదురు - 522 211 గుంటూరు జిల్లా

# 1998 జనవరి January

| | పండుగలు | | | | | |
|---|---|---|---|---|---|---|
| SUN ఆది | | | 4 | 11 | 18 | 25 |
| MON సోమ | | | 5 | 12 | 19 | 26 |
| TUE మంగళ | | | 6 | 13 | 20 | 27 |
| WED బుధ | | | 7 | 14 | 21 | 28 |
| THU గురు | | 1 | 8 | 15 | 22 | 29 |
| FRI శుక్ర | | 2 | 9 | 16 | 23 | 30 |
| SAT శని | | 3 | 10 | 17 | 24 | 31 |

